ఈయా రచయితవే

1. సందేశం
2. నేతబిడ్డ (ద్వితీయ ముద్రణ) ఆదర్శ గ్రంథమండలి.
3. ఇదా స్వతంత్రం ? ( ,, )
4. సీతారామరాజు పితూరి (ద్వితీయముద్రణ)
   (కొండపల్లి ప్రచురణ)
5. సంకెళ్లు
6. భూదేవి
7. కుంభకోణం
8. మాంచాలి
9. ఖైదీ (నవల ద్వితీయముద్రణ)
   (కొండపల్లి ప్రచురణ)
10. డాలరు పిశాచం (కథలు)
11. స్త్రీ (నాటికలు)

1956 తొలిముద్రణ 1000 లక్ష్మీప్రెస్.

ప్రచురణ : ప్రజాసాహితి
జాంపేట : రాజమండ్రి.

# స్త్రీ

## పరిచయం

"స్త్రీ" సర్వతోముఖ స్వరూపం. యీనాటికల్లో కొన్ని రూపాలు మీ ముందుంచా. యీ రూపక ఖండికలు "నవ్వులు — పువ్వులు" "గౌతమి" పత్రికల పునర్ముద్రణం. ఇందులో "శిక్ష" మదరాసులో రోజుకు మూడు ప్రదర్శనాలు చొప్పున వరుసగా రెండేండ్లాడిన "రక్తకన్నీరు" నాటకాన్ని లీలానుకరణం విపరీతమైన వేగాన్ని ప్రవేశపెట్టా. ఆ వేగాన్ని ఎమెచ్యూర్సు అందుకుంటే, సంతోషిస్తాను.

రాజమండ్రి
56 ఆగస్టు 15

నమస్కారం.
**పడాల.**

# శిక్ష

ఏకాంకిక:

## నటవర్గం:

| | |
|---|---|
| మోహన్ | లక్షాధికారి పుత్ర |
| సరస | మోహన్ ఉంపుడుకత్తె |
| పకీ | సరస తమ్ముడు |
| రఘు | మోహన్ బావమరిది |
| ప్రతిమ | మోహన్ భార్య |
| పురుషోత్తం | మోహన్ తండ్రి |

డాక్టరు

## రంగస్థలం

మోహన్ - సరసకు కట్టించిన మేడ రెండవ అంతస్తు చావడి. ఆ చావడికి కుడివైపు రెండు గదులూ, ఎడమ వైపు మూడవ అంతస్తుకు మెట్లు వున్నాయి. ఆధునిక అలంకరణతో, చావడి అంత చందాలు చిందుతోంది. చావడికి ముందుభాగం, (అంటే ప్రేక్షకులచూపుకువెనుకభాగం) ఎడమవైపు క్రిందకు వెళ్ళడానికి మెట్లున్నాయి.

పక్షి:– (చావడిగుమ్మంవద్ద నిలబడి బ్రాకెట్ల ఫిగర్ తీస్తూ) కరెక్ట్! ఆల్ కరెక్ట్! దొరికాడు– యిక్కడ దొరికాడు –అమెరికావాడు. మన్ డే – సెవన్, ట్యూజ్ డే – సెవన్, వెడ్ నెస్ డే –సెవన్, థర్స్ డే – సెవన్. ఓహో! ఫ్రైడే సెవన్! ఓహోహో! ఏం సులువుగా దొరికావురా నాయనా? టుడే– సాటర్ డే – అంటె సెవన్ తప్పదురా నాయనా! అందుకేరా అమెరికా అంటె ఆనంద తరంగాల్లో మునిగిపోతున్నారు– మాలాంటి నవపురుషులు! టుడే – సెవన్... సెవన్! కరక్ట్! ఆల్ కరక్ట్!

సర:– (వొయ్యారంగా, అభినయంతో, మూడవ అంతస్థు నుండి దిగుతోంది) టారటట్ట టాటాటా టారటట్ట టీరీరీ టార టార......

పక్షి:– (ప్లేటు ఫిరాయించాడు) కరెక్ట్ – ఆల్ కరెక్ట్!

సర:– (అభినయంతోనే) ఏంటి బ్రదర్ – ఆల్ కరెక్ట్?

పక్షి:– అదే ఆ బుద్ధితక్కువ బ్రహ్మ నీలో యిన్ని వొంపులు, సొంపులు పెట్టి ఎందుకు చెక్కాడా? అని సందేహ మొచ్చింది. దొరికింది సిస్టర్! ఆన్సర్ దొరికింది.

సర:– (అభినయంతోనే నవ్వుతూ) ఏంటీ?

పక్షి:– ఏంటా? ఆ బ్రహ్మకు ఆడదానిపై బ్రమారి బుర్ర చలించి, మైండ్ ఆబ్సెన్స్ అయింది. కంసాలి డైమండ్ నెక్ లెస్ ను నగిషీ చెక్కినట్లు నిన్ను చిత్ర విచిత్రంగా చెక్కి

సాదు. ఇదిచూచింది - సరస్వతి. ఇంకేముంది? కనిపెట్టి కక్కుర్తి చేసింది...

సర:- (సరదాగా) చేస్తే?

(క్రింద కారు హారన్)

పక్షి:- అదుగో! ఆ నరుడు చేతిలో పెట్టేశాడు.

సర:- ఏడిశావ్! (సరదాగా ఛాతీవిరిచి, చేయి విసిరింది)

పక్షి:- (ఆమె చేతికిందుగా తప్పుకొని) సరిగ్గా అంతే సిస్టర్! మోహన్ రాగానే అలా యింకోసారి ఛాతీ చక్ మని ఘుళిపించావా? — చిత్తయి నీ పాదాలముందు పాదరసంలా ప్రాకుతాడనుకో.

మోహ:- (చురుగ్గా మెట్లెక్కి వస్తున్నాడు)

పక్షి:- (ఎదురెళ్ళి పైమెట్టువద్ద ఆపుజేసి) వచ్చేసారు— బావగారు సిస్టర్! మా బావగారిచేతికి నరమేలేదు. (చేయి చాపాడు)

మోహ:- బలే జోక్ గా మాట్లాడుతున్నావేం? ఏం? ఎందుకు?

పక్షి:- అదేంటి బావగారూ! మీరు స్టడీకి అమెరికా వెళ్ళారు. నేను అదంతా యిక్కడే స్టడీ చేస్తున్నా!

మోహ:- ఏమిటోయ్ ఆ స్టడీ?

పక్షి:- అదా, కాటన్ మార్కెట్.

(మోహన్ సరసా పక్కనే నవ్వారు(

మోహ:- సరెలే కారు షెడ్‌లో పెట్టించు.

(పదిరూపాయల నోటు ఇచ్చాడు)

పక్షి:- (వెళ్ళిపోయాడు)

సర:- మన పక్షుండీ బలే ఫీరీలు తీస్తాడులెండి.

మోహ:- ఊహుూఁ!

(సరస చెంపపైన నాజూకుగా చేయివిసిరి నడుంకు చేయి మెలివేయబోయాడు)

సర:- (ఏదో వాసన తగిలి వెనక్కి జంకింది)

మోహ:- అదేం వెనక్కి తూలేవ్ ?!

సర:- (మాట మళ్ళించి) అబ్బే! కాలు బెణికింగిలెండి.

మోహ:- అరె ఎంతపని జరిగింది! (కాలు పట్టుకున్నాడు)

సర:- అబ్బా! పోయిందిలెండి (కాలు వెనక్కులాక్కుంది)

పక్షి:- (ఆయాసంతో వస్తూ) బావగారు బావగారూ! (ఆ దృశ్యంచూసి ముఖం వెనక్కు తిప్పుకున్నాడు)

మో:- (తడబడి) ఎవరు ? (లేచి వెనక్కు చూశాడు)

పక్షి:- (వెనుక ముఖంతోనే) వాడెవడో నన్ను కారు దగ్గిరికి రానివ్వడమే లేదంశి!

మో:- పక్షీ! ఇలా తిరిగి మాట్లాడు.!

పక్షి:- (చక్‌మని వెనక్కు తిరిగి) అవునండి బావగారూ!

మో:- ఎవడా బ్రూట్! (గబగబా క్రిందికి వెళ్ళాడు)

సర:- (పక్షి ప్రక్కజేరి) తమ్ముడూ! త...?

పక్షి:– సిస్టర్ !
సర:– ఎప్పుడూ వేళాకోళమే
పక్షి:– నిజం చెబుతున్నావా ?
సర:– అవును తమ్ముడు. ఆయన వళ్ళంతా వాసనేరా !
పక్షి:– (పక్కున నవ్వాడు)
సర:– (నోరునొక్కి) ఛా! ఏమిటానవ్వు. మామూలువాసన
కాదురా ?
పక్షి:– అయితే సారాలోకి దిగుంటాడు!
సర:– ఛా ! కాదంటే ! (నెమ్మదిగా, రహస్యంగా) నోటి
వాసనకాదురా !
పక్షి:– మరి ?
సర:– వళ్ళురా, వళ్ళు !
పక్షి:– వళ్ళే !
సర:– వట్టి దుర్వాసనరా !
పక్షి:– దుర్వాసనే ? అయితే ఏంచేద్దాం సిస్టర్ ?
సర:– ఇదంతా నేచూస్తాగాని, నువ్వెళ్ళి మన ప్రక్క
డాక్టర్ని ఇక్కడున్నట్టుగా తీసుకురా ! (క్రింద కేకలు
"చేతులో చమురు లేకపోయినా, ముండకు ముత్యా
లహారం! బుద్ధిలేదూ ? మోసంచేస్తావా ? చెయ్యండి,
కారు జప్తుచెయ్యండి" సరస గబగబా వెళ్ళి డాబా
అంచునుండి క్రిందదృశ్యం చూసింది.)

సర:- అయితే అబ్బాయి ఆరిపోయాడన్నమాట ?

పక్షి:- ఇక మనల్నార్పుతాడు, జాగ్రత్త సిస్టర్ !

(క్రింద మెట్లచప్పుడు)

సర:- సరే నువ్వెళ్ళు వస్తున్నాడు.

పక్షి:- (వెళ్ళాడు)

సర:- (మోహన్ వచ్చీరాగానే ప్రశ్నించింది) ఎవరండీ క్రింద ?

మో:- (ప్లేటు మార్చాడు) ఆఁ ఎవరూ లేరూ నా ఫ్రెండ్ ! ఏదో డాన్సు ప్రోగ్రాం వుందటా క్లబ్ కు రమ్మని ఇన్వైట్ చెయ్యడానికొచ్చాడు. నట్టి ఇడియట్ ! వాడికేం తెలుసు సరూ-మన మేడో హేవెన్లీ క్లబ్ ని, ఇక్కడో మైమరపించే మేనకుందని. (నడుంకి చేయి చుట్టి లాక్కు వెళుతున్నాడు)

సర:- (విషయాన్ని గొంతులో నొక్కుకుని) ఊఁ హూఁ ! (కూడా వెళ్ళింది)

(క్రింద మెట్లు ఎవరో ఎక్కుతున్న శబ్దం)

(మోహన్ మూడో అంతస్థులోకి వెళ్ళిపోయాడు ఇంకా మెట్లుమీదే వున్న సరస "ఎవరో"యని క్రిందకుదిగబోయింది.

పురు - నేనమ్మా ! మోహన్ తండ్రిని

సర:- ఓ...మామగారా ? ఎందుకొచ్చారో ?

పురు:- అబ్బాయికోసమే నమ్మా!

సర:- మీ అబ్బాయిని మేం కొరుక్కుతింటున్నామా?

పురు:- కాదమ్మా

సర:- ఏమైతే నాకేంలెండి. పిలుస్తా, (వెళ్ళింది)

మో:- (మెట్లమీదకు వచ్చాడు) ఎవరూ?

పురు:- కనపడ్డంలేదూ?

మో:- ఎందుకొచ్చావ్?

పురు:- నీకోసమే.

మో:- ఇంకెప్పుడూ రాకు.

పురు:- రాకతప్పలేదు.

మో:- తప్పించుకో.

పురు:- తప్పించుకోలేను నాయనా. దానికన్నీరు నా గుండెల్ని
కోసేస్తుంది బాబూ.

మో:- నువ్వు దాన్ని కోసేయ్ పీడ వదిలిపోతుంది.

పురు:- రామరామ! ఎంతమాటన్నావ్?

మో:- అంతమాట వినలేకపోతే ఆ దేముదుగొట్టుముఖంతో
యింటికిపోయి ఆ దేముడు కాళ్ళమీద పడు!

పురు:- నీకాళ్ళమీదే పడుతున్నా నీవెన్నిలక్షల ఆస్తిని పాడు
చేసినా నాకు కష్టం కలుగలేదు. కాని ప్రతిమ పవిత్ర
మైన పుస్తెలత్రాడు త్రెంచకు నాయనా?

మో:- ఓహో. ఏం పవిత్రత! ఏం శ్రీరంగనీతులు. యీ నీతులుచెప్పిన వాళ్ళంతా పాతబడి పోయారు. మళ్ళీ ఆ పాతర్లు తిరగేయకు. సీరియస్‌గా చెబుతున్నా ఆ త్రాడుముక్కలో నాకు విలువలేదు, అది మీ పెద్దలు వేడుకకోసం కట్టించిందంతే.

పురు:- అంతేనంటావా? అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్యను.

మో:- అధిక ప్రసంగం చేయకు! నీ ఛాందస తిక్కకబుర్లు ఇక నావద్ద చెప్పకు.

పురు:- నిదానించు! కన్నతండ్రిని ధిక్కరించ సాహసించకు.

మో:- నీవా కన్నతండ్రివి – నా శుఖాని కాటంకాలు కల్గించ చూపిన కసాయివి.

పురు:- ఓరి అప్రాచ్యుడా! ఒకపడుపుకత్తె పంచలోనా సుఖం?

మో:- నోరుముయ్! ఇక నాలుక కదిపావా? బయటకు పీకుతా!

పురు:- (కోపమొచ్చింది) కళ్ళు తెరచుకునే మాట్లాడుతున్నావా?

మో:- ఛీ! బయటికి ఫో! (గబగబావచ్చి మెడపట్టుకొని క్రిందకుగెంటి మేడమెట్లెక్కుతున్నాడు)

(పురుషోత్తం మెట్లపై దొర్లినశబ్దం)

సర:- (మెట్లుమీదకొచ్చి) ఎవరండీ ఆయన?

మో:- ఎవడో, ముష్టి వెధవ !

రఘు:- (నెత్తురుకళ్ళచూచిన పురుషోత్తంను ఎత్తుకొని 'చక్' మని వచ్చి) మోహన్!-యీ ముష్టి వెధవ కొడుకువే నీవని మరచిపోకు!

మో:- ఓ, నీవూవచ్చావ్ —యీ ముష్టిపీనుగుకు సాయం?

సర:- యీయ నెవరండీ?

మో:- ఒకప్పుడు యీయన చెల్లెలికి భర్తను నేను. కాని కనబడ్డంలే! యిప్పుడీయనే నాకు భర్త!

రఘు:-(ముసలివానినిదించి) అలా ఎన్నటికీకాదు బావా!

మో:- అయితే మర్యాదగా బయటికిపో!

రఘు:- (కోప మొచ్చింది) బావా! ఇదేనా నీ అమెరికా చదువు?

మో:- ఓ! సక్కగా గౌరీకళ్యాణం పాడుతోందే?—ఇది దరిద్ర భారతదేశంయొక్క బానిస ఎడ్యుకేషన్ కాదోయ్!

రఘు:- చాలు! నీ వెర్రితలలు వేసిన అమెరికన్ ఎడ్యుకేషన్‌తో భారతదేశాన్నే నిందించ సాహసించకు!

మో:- హహ్హహ్హహ్హ! (సీరియస్ గా)నీవిక్కడ కెందుకొచ్చావ్!

రఘు:- నిన్ను ముళ్ళబాటనుండి పూలదోటలో ప్రవేశపెట్ట డానికి. యీ ఆడ దెయ్యం అడవిలోనుండి, నీ దేవత గుడిలో ప్రవేశపెట్టడానికి?...

సర:- (వినలేక లోపలికిపోయింది)

మో:- (మేడ మెట్టుదిగి) షటప్! (కొట్టాడు)

పురు:- రఘూ! మురికిలో రాయే స్తే ముఖంపైనే తుళ్ళు తుందని మరచావా?

రఘు:- పోనీలెండి—నాకు తగిలిన చెంపదెబ్బ, మోహాన్‌లోనే గాని మార్పు తెస్తే నాకు మహాసంతోషమే.

మో:- మళ్ళీ నోరెత్తావా?—తప్పక యింకా పెద్దమార్పు నాలో చూస్తావ్?

పురు:- రా నాయనా! యింకా మొరటులో మార్పురాదు.

రఘు:- ఆగండి! (మోహాన్‌నుద్దేశించి) మోహాన్! యీమారు తున్న లోకంలో మనిషన్నవాడు మారితీరవలసిందే. లేకపోతే కాలమే మార్చితీసుతుంది. నీవిషయంలో కాలం మించిపోయింది. మరోసారి ఆలోచించుకో! ఇది మహాభయంకరమైన మురికికూపం.యీకూపంలో అడుగుపెట్టి, బయటపడ్డ మానవుడు చరిత్రిలో పుట్ట లేదు. పుటబోడు. పుట్టడు! జాగ్రిత్త—సెలవ్.

మో:- నోరుముయ్!

రఘు:- పదండి మామా! ("చక్" మంటూ, పురుషోత్తం గారిని తోడ్కొనిపోయాడు)

మో:- అహ్హాహ్హా! బ్రైన్ లెస్ బ్రూట్! (లోనికెళ్ళాడు)

ప:- (వస్తూ, డాక్టరుని ఆహ్వానిస్తూ) దయచేయండి! ఇలా దయచేయండి!

డా:- (దిక్కులుచూస్తూ డాబా ఎక్కాడు)

ప:- నిలబడండి! మా సిస్టర్‌ను తీసుకొస్తా (మేడమెట్లెక్కి సంజ్ఞ చేసాడు.

సర:- (వచ్చి) లోపలికిరండి—డాక్టర్!

డా:- ఓ, నీవా? ఇంకా ఎవరోఅనుకొని భయపడుతున్నా.

సర:- భయమెందుకు డాక్టర్, నిరభ్యంతరంగా రావచ్చు!

డా:- అబ్బ! ఎంతఅందమైన మేడ? ఎవరికానుకో?

సర:- ఎవరికానుకేముంది డాక్టర్. యౌవ్వనం అమ్ముకొని సంపాదించడానికి?

డా:- పిచ్చిదానా! యౌవ్వనం అమ్ముకొనికూడా అనేక మంది పొట్టగడవక, చెట్లనీడనే నివశిస్తున్నారని—నీకు తెలీదేమో?...ఏమైనా అదృష్టవంతురాలివి.

సర:- ఇదంతా మీ పెద్దల ఆశీస్సులఫలితం!...పైకి దయ చేయండి!

డా:- ఎందుకూ? పైనెవరున్నారు?

సర:- దయచేయండి! (పక్షితో) ఒరేయ్! డాక్టరుగారికి ఓవల్టిన్ చేయించి తీసుకురా!

ప:- అలాగే సిస్టర్! (పక్కగదిలోకి వెళ్ళాడు)

సర:- దయచేయండి! (డాక్టరును పైకి తీసుకెళ్ళింది)

ప:- (ఓక్షణంగడిచాక ఓవల్టిన్ తెచ్చాడు) ఎవడొచ్చినా నాకీసేవ తప్పలేదురా—గాయనా! ఓవల్టిన్ చల్లారి

పోతోంది. పైకి వెళితే ఒకచిక్కు—, కిందనుంటే ఇది చల్లారిపోతోంది...ఎలాగూ. అని?... (బుర్ర గోక్కొని) ఆ! మనమే పుచ్చేసుకుంటేసరి! మళ్ళీ ఇంకో కష్టంతో సిద్ధమైపోతాంగా! (లాగేసాడు) ఓహో! అందుకేరా నాయనా, పుడితే భోగిందాని తమ్ముడిగానే పుట్టమన్నాడు... (గదిలోకి వెళ్ళాడు)

డా:- (వేగంగా, గుమ్మం తెర తొలగించి, మెట్లుదిగుతున్నాడు)

మో:- సరసా ఏంటిదంతా? (గుమ్మంవద్దకు వచ్చాడు)

సర:- ("చక్"మనివచ్చి, దభీమని తలుపువేసి, గొళ్ళెం పెట్టింది)

డా:- (చావడిగుమ్మంవద్దకు వచ్చేసాడు)

సర:- (అడ్డువచ్చి) డాక్టర్!

డా:- అబ్బ! (వెనక్కి—తిరిగివచ్చి, కుర్చీలో కూలబడ్డాడు)

సర:- డాక్టర్!

డా:- ఆగు!

సర:- విషయం చెప్పండి, డాక్టర్!

డా:- (లేచి, వెళ్ళిపోబోతూ) చెప్పకూడనిది.

సర:- మీకు పుణ్యముంటుంది—చెప్పండి డాక్టర్!

డా:- కాదు—పాపం చుట్టుకుంటుంది—చెప్పకూడదమ్మ.

సర:- డాక్టర్

- చెబితే, నీగుండాగిపోతుంది.
- పరవాలేదు, చెప్పండి డాక్టర్?
- ఓ! నీవు వేశ్యవుకదూ?
- అయితే చెప్పకూడదా డాక్టర్?
- అందుకే చెప్పవచ్చనుకుంటున్నా, అందరికంటే గుండె ధైర్యం, మీకేవుంటుంది.
- మీరేమన్నా—పడతా! త్వరగా చెప్పండి డాక్టర్!
- కాని...?

(ఓవల్టిను తెచ్చాడు)

- ఇదితీసుకోని చెప్పండి డాక్టర్!
- చెప్పేవాడుగాక వినేవాళ్ళే యిదిప్పుడు తీసుకోవాలి.
- డాక్టర్! నా సిస్టర్ వొట్టి బేల, డాక్టర్! అదేంటో చెప్పండి డాక్టర్!

వీడెవడు?

నా తమ్ముడేనండి!...ఒరేయ్, నీవు లోపలికిపో!

- (ఓవల్టిన్ టేబిలుపై పెట్టి వెల్తాడు)
- (మేడపై తలుపులు గుద్దుతున్నాడు)

త్వరగా చెప్పండి—డాక్టర్!

చెబుతా...కాని...అతని జీవితం...

జీవితం...?

డా:- సర్వనాశనం!

సర:- అయితే త్వరగా చెప్పండి అతని జీవితమే సర్వనాశనమైతే నా బ్రతుకుకూడా నిప్పులపాలౌతుంది...?

డా:- నీ బ్రతుకెందుకవుతోంది?

సర:- నేనిప్పుడాయన...

డా:- అహ్హాహ్హాహ్హా!

సర:- డాక్టర్?

డా:- నీవిప్పుడాయన వుంపుడు కత్తెవైతే, ఒకప్పుడు నీకెంతమందో?

సర:- డాక్టర్! మాకూ హృదయముంది డాక్టర్?

డా:- అయితే చెప్పమంటావా?

సర:- చెప్పండి!

డా:- (సాలోచనగా) అతనికి సిగరెట్టు అలవాటుందా?

సర:- అలవాటేకాదండి! అదిలేకపోతే బ్రతుకులేదు.

డా:- యిప్పుడది మానితేనేగాని బ్రతుకులేదు.

సర:- ఏం డాక్టర్?

డా:- గుండెలు తినేసాయ్!

పక్షి:- అమ్మ, గుండెలే!

డా:- నోరుముయ్!...ఊఁ ఏమైనా త్రాగుతాడా!

సర:- బ్రాంది త్రాగుతాడు.

డా:- బ్రాందో - విషమో తాగుతాడు ?

సర:- తాగుతాడు.

డా:- అది బ్రాంది కాదని తెలుసా ?

సర:- మరి ?

డా:- అదా ? డబ్బుంటె బ్రాంది - లేకపోతే ... సారా! యాసిడ్ సారా! ప్రేగుల్ని, కోరికే సారా! నెత్తురును విషంచేసే సారా? గుండెల్ని తూట్లు చేసేసారా! తెల్సా? యీసారా! కొన్నాళ్ళుగా తాగుతున్నాడు.

సర:- కావచ్చు! డాక్టర్.

(పైన మోహన్ తలుపు కొడుతున్నాడు)

డా:- ఇతనికింకేమైనా బ్రతక లేని అలవాట్లున్నాయా ?

సర:- మీ మాటలు అయోమయంగా వున్నాయ్ - డాక్టర్! నాకేమీ అర్థంకావడంలేదు.

డా:- (నవ్వాడు)

సర:- డాక్టర్ ?

డా:- దొంగిలించిన వస్తువేంటో, దొంగకే తెలీదా ?

సర:- నేనా ? దొంగతనం చేసానా ?

డా:- భుజాలు తడుంకోకు! నీవద్దకెలా వచ్చాడు ?

సర:- మోహించి.

డా:- మోహమనేది వున్నమనిషికి, నీవే తొలి మోహినివెలా అవుతావ్ ?

సర:— డాక్టర్ ?

డా:— నీలా, అతనూ అనేక చేతులు చూచుంటాడు.

సర:— అయితే ?

డా:— కొంప మునిగిపోయింది.

సర:— తిన్నగా చెప్పండి — డాక్టర్ !

డా:— తిన్నగా చెప్పలా ?...ఇదీ ... భయంకరమైన మహా రోగం.

సర:— డాక్టర్ !

డా:— అవును ! దీనికి మందు లేదు — మరణంతప్ప !

సర:— డాక్టర్ !

డా:— ఇదీ—కుష్టు ! (చక్ మని వెళ్ళిపోయాడు)

సర:— డాక్టర్ !... (మేడమీదనుండే క్రింద వెళుతున్న డాక్టరునుచూస్తూ అలాగే పిట్టగోడకు వాలిపోయింది)

పక్షి:— (వచ్చి) సిస్టర్...(దగ్గరకెళ్ళి) అదేంటి సిస్టర్ మన ముండగా యీ విచారం ! రా ! మనం తల్చుకుంటే, బొమ్మను, బొరుసు చేసెయ్యం ?

సర:— నీవు కాఫి తెచ్చిపెట్టు !

పక్షి:—(వెళ్ళాడు)

సర:— (చక్ మని ఆలోచన తట్టి గబగబా మేడమెట్లెక్కి—గొళ్ణాం తీసింది.)

మో:— (గబుక్కున తూలి బయటికొచ్చాడు)

సర:— (తప్పుకొని గుమ్మానికి అడ్డు నిలబడింది)

ప్రతి:—(గబుక్కునవచ్చి) బావా?

మో:— ఓ శనిగ్రహమా?

ప్రతి:— మీరేమనండి! నా శిరస్సును తెగేసినా, నా బ్రతుకు
మీ పాదాలవద్దె.

మో:— తెగించే వచ్చావన్నమాట. ఓసి రాక్షసీ! పోతావా
పోవా?

ప్రతి:— మీరే నా పసుపుకుంకుమ.

మో:— దెయ్యం వేదం పాడుతోందే? డేమిట్! నీవు నిజంగా
శనిగ్రహానివే. అదిగోచూడు! నీ ముఖంలో పురుగులు
మెదుల్తున్నాయి! ఛీ! కురూపీ! నా సరస గోరుకైనా
పోలని నీవు — యీ ముంగిట అడుగుపెడతావా? ఫో?
బయటకుపో!

ప్రతి:— పోనీ, యీ సరసను అక్కగా భావించి - యిక్కడే
మీ చరణదాసిగా వుండిపోతా!

మో:— ఛీ! చరణదాసీగా కాదుగదా! చీపురుకట్టగాకూడా
వుండడానికి నీవన్ఫిట్! ఫో! నన్ను మండించావా?..

ప్రతి:— అలాఅనకండి! మీరే నా సర్వస్వం. నా మాంగల్యం

మో:— వున్నకొలదీ చంద్రమతివై పోతున్నావ్? మాటలతో
పోతావా? లేకపోతే చెప్పు పుచ్చుకోమన్నావా?

పతి:- మీరేంచేసినా నాకు సంతోషమే.

మో:- కుక్కలా కొడుతున్న కొలదీ కూడాపడకు! నా ఆనందానికి అంతరాయం కలిగించకు! ఫో! బయటకిఫో!

ప్రతి:- మీ ఆనందానికి అంతరాయం కలిగించను! పొమ్మన కండి! మీ పాదాలవద్ద స్థానమివ్వండి! (కాళ్ళపై బడింది)

మో:- ఛీ! (తన్నేడు)

ప్రతి:- (కాళ్ళు పట్టుకొని) మీరేం చేయండి! మీరే నా బ్రతుకు!

మో:- ఛీ! డెవిల్! (సిగపట్టుకొని, యీడుస్తూ) ఫో! బయటకు ఫో!...ఒరేయ్! పక్షి! (పక్షిని పిలిచాడు)

పక్షి:- (గదిలోంచి చప్రున వచ్చాడు)

మో:- దీన్ని క్రిందకు గెంటు! (ప్రతిమనొదిలి వచ్చాడు)

పక్షి:- (ప్రతిమ రోదిస్తున్నా, లక్ష్యం చేయకుండా, క్రిందికి గెంటుకు పోయాడు)

సర:- (వస్తున్న మోహనుతో) అక్కడే నిలబడు!

మో:- నేనేమన్నా తప్పుచేసానా?

సర:- కాదు.

మో:- ప్రతిమను గెంటేసాననా?

సర:- కాదు.

మో:- యిక్కడే దాసిగా వుండనివ్వ లేదనా? (పైకి వెళ్ళ బోయాడు)

సర:- కాదు—ఆగు!

మో:- నిజంగానా?

సర:- అవును. అదుగో అలద్దంవద్దకు వెళ్ళు! అద్దాన్ని మాత్రం ముట్టకు.

మో:- ఏం?

సర:- వెళ్ళు! ఆ అద్దమే చెబుతుంది. (చప్పట్లుచరిచి) పక్షీ!

పక్షి:- (వచ్చాడు) ఏం సిస్టర్?

సర:- అద్దంవద్దకు తీసుకెళ్ళు!

పక్షి:- రండి బావగారూ! (పట్టుకోబోయాడు)

సర:- పక్షీ! అతన్ని ముట్టకు.

మో:- (కోపమొచ్చింది) సరసా?

సర:- అవును. నీ ముఖంలో పురుగులు మెదులుతున్నాయ్.

మో:- ఏమన్నావ్?

సర:- అవును. నీ శరీరంనుండి దుర్వాసనకూడా వస్తోంది.

మో:- ఆపుచెయ్! నా శరీరంలోని చెమటనే పన్నీటిగా నీవాస్వాదించిన రోజులున్నాయ్.

సర:- వొట్టిది! ఒక వేళ నీ చెమటనే నేనాస్వాదిస్తే - అది చెమటకాదు. నీ జేబులోనున్న డబ్బునుండి కారిన బంగారు నీరుమాత్రమే.

మో:- నీచురాలా! అయిదులక్షలు ఖర్చుపెట్టి, నీకి వెన్నెల మేడకట్టించి, చిన్నెల రామచిలుకలా ముత్యాల పొన్నులపై కురిపించాను. కాని రామచిలుకవల్లా కొండచిలువక్రింద తయారయ్యావ్!

సర:- అలా తయారయింది నీవే. ఒకప్పుడు నీ ఆనందానికి నన్ను అలంకరించుకున్నావంతే!

మో:- అయితే, వేలకు వేలు ఖర్చుపెట్టి నీకు జన్మదినోత్సవాలెందుకు చేయించానో గుర్తుతెచ్చుకో.

సర:- అది నీ పరపతికోసం.

మో:- సరసా! సాహసంగా మాట్లాడుతున్నావ్.

సర:- సాహసంకాదు. సహనంతో మాట్లాడుతున్నా. జాగ్రత్త! నీ డబ్బుతో నా యౌవ్వనాన్ని అనుభవించావ్! నీవద్ద యిక డబ్బులేదు. పైగా వొళ్ళు కుళ్ళిపోయింది.

మో:- ఏమన్నావ్?

సర:- అవును. ఇక నీవీగడప తొక్కకూడదు.

మో:- చాలించు! నీ ప్రేలాపన.

సర:- అంతేకాదు. అంతా చరించే చోటకూడా నీకిక చోటు లేదు.

మో:- ఏమన్నావ్?

సర:- అహ్హా హ్హా హ్హా! నిన్నిప్పుడు భయంకరమైన కుష్ఠురోగం ఆవరించింది.

మో:- సరసా! (మీదికెళ్ళాడు)

సర:- పక్షీ!

పక్షి:- (బరబరా వెనక్కి లాగేడు)

మో:- సరసా! ఎంతపని చేశావ్! నేనిప్పుడు కుష్ఠురోగినా!

పక్షి:- లేదు బావగారూ! ఇక మీరు గంటగంటకీ ఒక్కొక్క అవతార మెత్తేస్తారు.

మో:- పక్షీ!

సర:- నీవు అతన్ని బయటికి గెంటరా!

పక్షి:- (లాగుతున్నాడు)

మో:- (గింజుకుంటూ) సరసా! పోనీలే! నన్నిక లోకం అసహ్యించుకుంటుంది. గతాన్ని బట్టి అయినా నీగదిలో ఓమూల చోటియ్! నేను చేసిన పాపానికి యిక్కడే ఫలితం అనుభవిస్తా!

పక్షి:- ఆ! ఆ! ఎంతమాట మన అమెరికన్ ఎడ్యుకేషన్‌లో పాపపుణ్యాలు లేవుకదండీ?

మో:- పక్షీ! నన్నిక రంపంతో కోయకు! ...సరసా నిన్ను జాలిచూపమని వేడుకుంటున్నా.

సర:- సరే, పక్షీ! ఆ ప్రక్కగదిలో పారెయ్! ఆ వొంటిప్తై బట్టలూడపీకి కిరసనాయిలుపోసి తగలెట్టు ఊలా కెళ్ళు

మో:- సరసా!

పక్షి:- (లాక్కెళ్ళి, గదిలోపారేసి, ఓ పుల్లకు ఆ బట్టలు తగిలించుకొని వస్తూ, బయట గొణెంపెట్టాడు) అరె! భగవాన్ ఎంతెంత పనులు చేయిస్తున్నావురా. నాయనా! ఇక మన అమెరికన్ కాటన్ మార్కెట్టు బంద్ చేశావుగందా!... పగవాడికయినా పెట్టొద్దురా బాబూ—యీ బాధ.

సర:- (పైనుండి) ఇంకా ఏంటాలోచిస్తున్నావ్—

పక్షి:- ఇచ్చావుగా కార్యక్రమం—యింక తగలెట్టమని వీటితో పాటు ఆయన అమెరికన్ ఎడ్యుకేషనూ తగలడుతుంది. నా కాటన్ మార్కెట్టు తగలడుతుంది, ఏం చేయడమా? అని ఆలోచిస్తున్నా సిస్టర్!

సర:- ఏడిశావ్ — తిండికిరా!

మో:- సరసా?

సర:- చూడు! ఏదో అఘోరిస్తున్నాడు!

పక్షి:- (గుమ్మంవద్దకొచ్చాడు)

మో:- పాతచొక్కా ముక్కయినా పారేయ్ సరసా!

సర:- సరే, నీ చినిగిన చొక్కా పారెయ్! (పైకి వెళ్ళిపోయింది)

మో:- ఒరేయ్, పక్షీ?

పక్షి:- (చొక్కాతో వచ్చి) ఏం బావా?

మో:- ఆకలిరా! ఆకలి! ప్రేగులు మాడిపోతున్నాయ్ రా!

పక్షి:- అలాగే బావా! (అని పైకి వెళ్ళబోతాడు)

మో:- అందాకా ఒక సిగరెట్టయినా పారేయరా?

పక్షి:- ఏదిబావా! నీతోనే నా జల్సా చచ్చిపోయింది. యిప్పుడు కాల్చిన ముక్కయినా లేదు. ఇదిగో, చొక్కా తొడుక్కో, తిండి తెస్తా! (గొళ్లెంతీసి, చొక్కా విసిరి, మరల గొళ్లెంపెట్టి సగంమెట్లు యెక్కి) సిస్టర్!

సర:- (వచ్చింది) ఏం?

పక్షి:- పాపం ఆకలట సిస్టర్!

సర:- చావనియ్. అన్నంలేదు, సున్నంలేదు. చావటమే మంచిది. లేకపోతే మనలనే చంపుతాడు. తమ్ముడూ ఒకదెబ్బకు రెండు పిట్టలు. మనకూ తిండిఖర్చు లేదు. వాడు చావనూ చస్తాడు.

పక్షి:- వెరీగుడ్ ఐడియా సిస్టర్!

మో:- ఓసి రాక్షసిముండా! నన్ను చంపడానికా - యీ గదిలో పారేశావ్?

సర:- అలాగే ప్రేలుతుండు. నీ సంగతి కనుక్కుంటా!

మో:- ఛీ! కులటా!

సర:- ఏం వాగావ్! పక్షి! తియ్, తలుపు! (పైకెళ్ళి గదిలో పేకబెత్తం తీసుకొని వచ్చింది.) తియ్ తలుపు!

పక్షి:- (గొళ్లెంతీసి తలుపు తోస్తాడు)

మో:- (టపీమని బయటపడ్డాడు. ముఖంలో కళలేదు. మచ్చలున్నాయ్)

సర:- ఇప్పుడు ప్రేలు! ప్రేలతావా! కులటనా? రాక్షసినా? (పేకబెత్తంతో చావగొట్టింది)

మో:- అబ్బ! కొట్టకే! ఎక్కడికైనా పోతాను అబ్బ!

సర:- (కొడుతూ) పో! నా గుమ్మంముందు వుండకుండా పో! పోతావా?

మో:- అబ్బ! కొట్టకేపోతాను (భారంగా బాధతో లేచాడు)

సర:- (కొట్టింది)

మో:- అమ్మా (పడ్డాడు)

సర:- పక్షి! పీడ్ని బయటకు తోసెయ్!

మో:- నే నే పో తా! (నెమ్మదిగా లేచి గుమ్మంప్రక్కగా వెళ్లాడు)

సర:- అ హ్హా హ్హా హ్హా! పీడ వొదిలిపోయింది.

ప్రతి:- (చప్రున వచ్చింది. ఎదుటి భర్తను పోలికకట్టలేదు) అమ్మా! రక్షించు! నా భర్తను నాకియ్! నా మామను చావునుండి రక్షించు!

మో:- (వెనక్కి చూచి, మరల కుంటుతూ ముఖం వెనక్కి త్రిప్పుకున్నాడు)

ప్రతి:- యీమాత్రం సాయంచేయలేవా? వచ్చేజన్మలో నీ కడుపునపుట్టి, ఋణం తీర్చుకుంటా

సర:- ఛీ! నీవు నా కడుపునపుట్టడం ఎందుకు? అడుగో నీ భర్త!

మో:- (నాళ్ళు తెగాయ్. రెండడుగులు ముందుకేసాడు)

ప్రతి:- నిజంగానా?

సర:- అవును!

ప్రతి:- అయితే అంతకంటే నాకాకావలసిందేమిటి? నీవు

కరుణామూ_ర్తివి తల్లీ! నీ ఋణం తీర్చుకోలేను (వెస క్కి_తిరిగి) బావా?

మో:- (ఇంకో అడుగు ముందుకేసి కుమిలిపోతున్నాడు.)

ప్రతి:- నాతప్పులేవైనా వుంటె క్షమించుబావా? మీపాదా లను పూజించే భాగ్యం కలిగించుబావా?

సర:- అహ్హాహ్హాహ్హా!

ప్రతి:- ఎందుకమ్మా-నవ్వు?

సర:- నీ బావ ముఖం చూపెట్టలేకపోతున్నాడు.

ప్రతి:- నా బావేం తప్పుచేశాడు?

సర:- నీబావిప్పుడు - కుష్టురోగి!

ప్రతి:- బావా? (అని ఎదురెళ్ళింది)

మో:- (ముఖం ప్రక్క_కుతిప్పి) ప్రతిమా! నీవు దేవతవు! నా పాపపుముఖం చూడకు. నన్ను దూరంగాపోనియ్

ప్రతి:- అదేంటిబావా! నీవే నాకు దేవుడవు. కుష్టురోగివైనా నిన్నొదిలి నేనొకక్షణం వుండలేను.

మో:- ప్రతిమా! కాదు నీకు నాముఖం చూపెట్టను. మెట్లు దిగి క్రిందకు వెళ్ళిపోయాడు)

ప్రతి:- బావా! బావా! (వెంటాడుతూ వెళ్ళింది)

పక్షి:- }
సర:- } అహ్హహ్హహ్హా!

రఘు:- (క_త్తిలా వస్తాడు)

సర:- ఓ అన్నయ్యగారా?

రఘు:- అమ్మా! ఇప్పుడు ఎగతాళికి సమయంకాదు. నా బావెక్కడ చెప్పు?

సర:- ఎందుకు ?

రఘు:- ఆయనతండ్రి - పురుషోత్తముడు - చనిపోయాడు.

సర:- అయితే, నీ బావను తీసుకెళ్ళడానికే వచ్చానన్నమాట

రఘు:- అవును !

సర:- వెళ్ళిపోయాడు.

రఘు:- నిజం చెప్పు !

సర:- అబద్ధం ఆడవలసిన అగత్యం నాకు లేదు.

రఘు:- ఎప్పుడు ? ఎవరితో ? ఎక్కడికి ?

సర:- ఇప్పుడే ! నీ చెల్లెలితో, మీ ఇంటికే !

రఘు:- నిజం ?

పక్షి:- నిజం బ్రదర్ ! నిజం! (వ్యంగ్యంగా) మనిషిమారిపోయి
మరీ వెళ్ళాడు.

రఘు:- అనగా ? నా బావమారాడా ?

సర:- (వికటంగా నవ్వింది)

రఘు:- ఏంటీ ఎగతాళీ ?

పక్షి:- ఎగతాళికాదు బ్రదర్.

రఘు:- మరేంటో త్వరగా చెప్పండి !

సర:- నీ బావిప్పుడు - కుష్ఠురోగిగా మారిపోయి , మరీ
వెళ్ళాడు.

రఘు:- కుష్ఠురోగా ? పూటకాలేదు. అప్పుడే మారిపోయాడా?

పక్షి:- ప్రయత్నించు బ్రదర్ - పనిజరుగుతుందేమో ?

సర:- అవును - ఏమైనా చేయగల యువకుడివి!

రఘు:- నోరుముయ్! వంచకీ! నీచులారా! నా బావను నిలు
వల్లా కొల్లగొట్టి అలాచేస్తావా? పండంటి కాపురంలో
నిప్పులు చెరిగిన పాతకీ! నా బావకు నిజంగా కుష్టు
రోగమైతే ఎలాగూ బాగుపడతాడు. కాని నీవో
నోట పురుగులుపడి చస్తావ్? చిక్కి, శల్యమై శ్లేష్మం
లోపడ్డ యీగలా తన్నుకొని, తన్నుకొని, జబ్బుతో
చస్తావ్. కన్నెత్తి చూచేవాడు కనబడడు. (సరస
మాట్లాడబోగా, మరల అందుకొని) నీవుచచ్చినా,
నీ పాపాలుపోవ్! యమునిచేతిలో పడతావ్. అతని
ఇనుపగిట్టల దున్నపోతు, నిన్ను త్రొక్కి త్రొక్కి మరీ
చంపుతుంది. యముని లెఖ్కగాడు- చిత్రగుప్తుడు మరీ
కర్కోటకుడు. తిండిలేక పతితులయినవారినీ, బాల్య
వితంతువులై పెడదారిత్రొక్కిన అభాగినులను క్షమి
స్తాడుగాని, నీలాంటి మదమెక్కి, కైపెక్కి కులికే,
వ్యభిచారిణిని క్షమించడు. నిన్ను సలసలకాగే
నూనెలో ముంచెత్తుతాడు, నిలువుగా, అడ్డంగా, ఏట
వాలుగాకూడా, ముక్క ముక్కలుగా కోసి మరీ
వొదులుతాడు పాతకీ! నీకు ఆఖరికి ప్రాప్తించే శిక్ష!
భరించలేని, భయానకమైన, కుష్టురోగం!

పత్ని:- (నోరెత్తబోయాడు)

రఘు,- నోరుముయ్ !

సర:- (నోరెత్తబోయింది)

రఘు:- షటప్ - బిచ్చ్ ! (చక్‌మని వెళ్ళిపోయాడు)

పక్షి:- (ఖిన్నురాలయిన సరసతో) సిస్టర్ ! ... (కుర్చీలో కూలబడ్డాడు)

సర:- (రఘు మాటలకు, మనస్సు కోల్పోయి, కాళ్ళు తేలిపోయి, తూగుతూ వెళ్ళి, పిట్టగోడపై వాలిపోయి, తూకం అటు ఎక్కువై డాబానుండి క్రిందకు పడిపోయింది.)

(క్రింద పెద్ద శబ్దం)

పక్షి:- సిస్టర్...(గబగబా పిట్టగోడవద్దకెళ్ళి, క్రిందకుచూచి, సరసకు ప్రాణాలు పోవడం కళ్ళారాచూచి కాళ్ళీడ్చుకుంటూ) సిస్టర్...! (మెట్లుదిగాడు.)

సమాప్తం.



# ప్రేమ

## ఏకాంకిక

### ఇందులో

గిరి — వేశ్యాంగన
రాజు — గిరిని ప్రేమించినవిద్యార్థి
భోగారావు — గిరిని కామించిన సరసుడు
దండపాణి — కుష్ఠురోగి
భక్తి — గిరి తల్లి

వస్తారు.

రంగస్థలం:- 'శిక్ష' నాటికలోని సరస మూడంతస్తుల మేడ లోని రెండవ అంతస్తుభాగనే.

రాజు:- (క్రిందినుండి రెండవఅంతస్తు చావిడిలోకి వచ్చి, ఆత్రుతగా) గిరీ...గిరీ...గిరీ ?

భక్తి:- (మూడవఅంతస్తునుండి రెండవఅంతస్తు చావిడికి వచ్చి) ఎవరూ !

రాజు:- నేనూ...

భక్తి:— (నల్లమందుబిగిస్తూ, కళ్ళజోడులోనుండి చూస్తూ) ఎవడవురా ?

రాజు:— ఎవడనా ? ... గిరిని... !

భక్తి:— ఓసి, నా గుడ్లుపీకా ? నీవా, నాయనా ? ఏం ?

రాజు:— గిరెక్కడ ?

భక్తి:— ఎందుకు ?

రాజు:— ఎక్కడ చెప్పు ?

భక్తి:— ఓసి, నీబొడ్డుబొక్కా ! చదువుకున్నప్పుడు, కాస్త చనువయిందో లేదోకాని, మా చంక నెక్కేట్టు మాట్లాడుతున్నావే ?

రాజు:— అవును. జాతిబుద్ధి చూపించుకుంది. నాతో తప్పక పెండ్లి చేసుకుంటానని ప్రమాణకంచేసి, కాలికిగజ్జకట్టి, పైగా భోగంమేళంలో తైతక్క లాడుతుందా ?

భక్తి:— అబ్బోసి, మా తాడుకట్టి ఏలేసినమగోడిలా బయలు దేరేవే ?

రాజు:— ముందు గిరెక్కడచెప్పు ! తాడేకట్టానో, తలే యిచ్చానో చెబుతా !

భక్తి:— తొండముదిరి వూసరిల్లి అవుతోందే ! ముందు బయటికినడు. ఇకనుండి, నీ నీడ దానిపై వాలడానికి వీలు లేదు.

రాజు:— అదేదో తేల్చుకుందామనే వచ్చా. తిండిలేకపోతే ముష్టెత్తుకుతిరిగితే బిక్షపుడుతుంది. ఛీ ! అభిమానం చంపుకొని...

భక్షి:- ఆపుచెయ్! ఆపుచేయ్‌వోయ్, పిల్లోడా! అభిమానం చంపుకొని మానద్దకొస్తే బిక్షపారేసే మమ్మల్నే హీనపరుస్తున్నావ్?

రాజు:- అవునులే! దెయ్యం వేదం పాడుతుందనుకోడం నాది పొరపాటు. సరే! గిరెక్కడ చెప్పు?

భక్షి:- చెబుతా! జేబులో ఏమేసుకొచ్చావ్-బుల్లోడా?

రాజు:- ఎంతమాటన్నావ్? ఏంచేసావ్ - గిరిని?

భక్షి:- కులవృత్తికి సాటిలేదని మీ పెద్దలు చెప్పారుగా! అది చదువుకున్నదికాబట్టి కులవృత్తి స్వీకరించింది. అంతే! కన్నెరికం అయిపోయింది. డబ్బు తెచ్చుకున్నావా?- చాలు. గిరిని ఎన్ని సార్లయినా పలుకరించొచ్చు! ఏమంటావ్? బుల్లోడా?

రాజు:- మహాదారుణం - గిరిని అమాంతంగా నరకంలోకి త్రోచేసావ్?

గిరి:- (జడచూచుకుంటూ మూడవఅంతస్తు దిగింది.)

రాజు:- గిరీ? (అని ముందుకెళ్ళబోయాడు.)

భక్షి:- ఆగు! ముందుకెళ్ళకు!

రాజు:- గిరీ?

గిరి:- అవును! మా అమ్మ చెప్పిందంతా అక్షరాలానిజం!

రాజు:- నిజమా?

గిరి:- ముమ్మాటికీ నిజం!

రాజు:- అయితే,...

భక్షి:- అయితే, గియితే లేదు ముందు బయటికెళ్ళవోయ్ !

గిరి:- వుండవే- మధ్య నువ్వేమిటి ? ఊ ! అయితే ?

రాజు:- నీవు, నీతల, పుష్పంగా త్రుంచి, నాకాళ్ల మీద వేస్తానని, నీహృదయంకోసి, నా గుప్పిట్లో పెడతానని, యీ నరకతుల్యమైన జాతినుండి నిన్నుద్ధరించమని, ప్రాధేయపడిన మాటలన్నీ బూటకాలేనా ?

గిరి:- కాదు.

రాజు:- అయితే నీతల్లి బలవంతంగా మెళ్లువిరిచి యీ వృత్తి లోదించిందా ?

గిరి:- కాదు.

రాజు:- అయితే ఎందుకీ నీచవృత్తి నవలంభించావ్ ? నేను నీశిరస్సు, నా దోసిల్లో పెట్టుకొని ఎన్నెన్ని ఆవేశ పూరిత విషయాలు. ఆవేదించుకున్నానో మరిచావా ?

గిరి:- లేదు.

రాజు:- నాకున్న ఒకే ఒకతల్లిని ఎంతటి మాతృభావంతో చూచుకుంటున్నానో, అంతటి ప్రేమభావంతో, నిన్ను చూచుకుంటానని, కంట తడిపెట్టుకొని నేను చెప్పిన విషయాలు, నీ హృదయాన్ని తాకలేదా ?

గిరి:- తాకాయ్ ?

రాజు:- మరెందుకీపని చేసావ్ ?

గిరి:- నీతో నేను సుఖపడలేనని గ్రహించడంచేత ?

రాజు:- నీకు సుఖమేప్రధానమైతే, నేను ఎంతబాధపడి

బిక్షాటన చేసుకొని నా చదువును పూర్తి చేసు
కున్నానో, అంతకంటె, అధికంగా బాధపడైనా నీకు
సుఖాన్ని చేకూరుస్తానని హృదయం విప్పి చెప్పేనే ?

గిరి:— భిక్షాటనలో జీవించేది సుఖంకాదని నాకు తెలుసు ?
అటువంటిబ్రతుకులో నాఅందాన్ని, సుఖాన్ని, బలి
చేసుకోదలచుకోలేదు.

రాజు:— ఇంతాచదివి నేర్చుకున్న దిదా ? ప్రతీవానిగుప్పెట
నలిగి, నాశనమయ్యేది సుఖమంటావా ?

గిరి:— అవును ! ఇంటింటా దండుకు నేవాడు నాలుగురుచులూ
ఎలాచవిచూడ గలుగుతాడో, నేనూ అంతే.

రాజు:— కట్టిపెట్టు నీ కోరిక !

గిరి:— ఇక ప్రసంగం వృథా ! నా కిష్టంలేనిదాన్ని రుద్దడానికి
ప్రయత్నించకు.

రాజు:— ఇష్టం లేకపోయినా, నిన్నుమళ్ళించడం నావిధి.

భక్షి:— మర్యాదగా వెడతావా, లేదాంట !

గిరి:— అంతవరకూ తెచ్చుకోకు, రాజూ !

రాజు:— గిరీ ! ... ... కాదు ... ... పడుపుగత్తె !

భక్షి:— (చేతికర్రతో కొట్టింది)

రాజు:— (దెబ్బతిన్న తలపట్టుకొని) అమ్మ ... ఇంతకంటె బల
మైనదెబ్బ, ఎప్పుడో ఒకప్పుడు నీ జీవితంలో తప్పక
తింటావ్ లే !

గిరి:— (తూష్ణీభావంగా ప్రక్కగదిలోకి వెళ్ళిపోయింది)

భక్షి :- ఇంకానిలబడ్డా వెందుకంటా!

రాజు:- లేదు — వెడుతున్నా. నీవు మామూలుభక్షివు
కాదు—నరభక్షివి (వెళ్ళిపోయాడు)

భోగా:- (వస్తూ, రాజుకు గుద్దుకొని) ఓ, నీవా?

రాజు:- హు! (వెళ్ళిపోయాడు)

భోగా:- ఆహ్హాహ్హాహ్హా!

భక్షి:- రండి! రండి! మీకోసమే కళ్ళు కాయలుకాచేలా
చూస్తున్నా.

భోగా: నల్లమందుకా?

భక్షి:- ముసలిముండనుకదూ?

భోగా:- అయితే, అంత అలవాటెందుకు?

భక్షి:- మీపడుచువాళ్ళకు, మాపడుచులంటే, వున్నంత
నిషా, నానల్లమందులో ఇంకా తక్కువేకదూ?

భోగా:- మొత్తానికి, మాపెంకిపిండానివే? అయిదురూపాయ
లకాగితం చేతిలో పెట్టాడు.)

భక్షి:- రా! బాబూ! మేడమీదికిరా! యీమేడ, మీ
అందరి చలవవల్లనే కట్టించానుబాబూ! పదబాబూ
మాగిరిని పైకిపంపుతాను. పద!

భోగా:- అలాగే! (అంటూ, పైకివెళ్ళాడు)

భక్షి:- గిరీ! గిరీ! ఏమేవ్?

గిరి:- (వచ్చింది) ఏం?

భక్షి:- అయ్యోపిల్లా! అదేంటే పైని పెద్దమనిషి నీకోసం
వచ్చి కూర్చుంటేనె?

గిరి:— నావంట్లో బాగోలేదు.

భక్షి:— బాగుంది. ఎవడన్నా నవ్విపోతాడు — పైన పెద్దమని షేటి, నీ వేషాలేమిటి ? ఊ! వెళ్ళు ! (అంటూ, గది లోకి వెళ్ళి) ఇంకా బొమ్మలా నిలబడ్డావేం ? ఎక్కూ! మేడ ! (లైటు ఆరిపి, గది తలుపు వేసుకుంది)

గిరి:— (బాధపడుతూ, తల చేత్తో పట్టుకొని, గతిలేక మేడ మెట్లు తూగుతూ ఎక్కబోతోంది)

పాణి:— (వెనుకనుండి తన హస్తంతో, గిరి జెబ్బపట్టుకొని) ఆగు!

గిరి:— ఎవరూ ? (వెనక్కి తిరగబోయింది.)

పాణి:— వెనక్కి తిరిగావా, కళ్ళు తిరుగుతయ్ !

గిరి:— మీ రెవరు ?

పాణి:— పదహారేండ్లయినానిండని, నిండుకన్నెవు. చూస్తూ నాకళ్ళముందు—కార్చిచ్చులో దిగుతూంటే, ఎలా పూరుకోగలను ?

గిరి:- ఏది కార్చిచ్చు !

పాణి:— అహ్హా హ్హా హ్హా ! పిచ్చిదానా ? నీవు చొరబడుతున్నది కార్చిచ్చుకంటే, దహనశక్తిగలది. ఇందులో చొరబడి, బతికి బయటపడ్డ వ్యక్తిలేదు. బయటపడు.

గిరి:— మీ రెవరు ?

పాణి:— చెప్పను.

గిరి:— (వెనక్కి తిరగబోయింది.)

పాణి:— తిరిగావా ? జాగ్రత్త! (బాకు వీపుకు చూపాడు)

గిరి:- (కెవ్వున అరిచింది)

(ఆ అరుపువిని, భక్తి. తలుపు తెరచుకొనివచ్చింది. పాణి వెళ్ళిపోయాడు. గిరి, వెంటనే లైటు వేసింది. ఆ లైటు వెలుతురులో, పారిపోతున్న పాణీ వీపు కన బడిందంతే.)

గిరి:- అమ్మా! (అని భక్తి గుండెకు వాలింది.)

భక్తి:- పిచ్చిముండా! ప్రతీచిన్నవిషయానికీ, బెదురుతావ్? నేనుచూడు! వీధిగుమ్మంలో ఒకడ్ని, దొడ్డిగుమ్మంలో ఒకడ్ని, మంచంకిందొకడ్ని, పైనొకడ్ని పెట్టి, వాళ్ళ జుట్టు నాగుప్పెట్లోపట్టి మరొకడ్ని చేతిలోపెట్టుకొని ఆడించేదాన్ని. ఆ! ఏమనుకున్నావ్? పిచ్చిపిల్లా! వెళ్ళు, పైకెళ్ళు! (బలవంతంగా పైకిపంపి లైటు వేసి లోనికెళ్ళింది.)

పాణీ:- (వచ్చిలైటువేసాడు.) భక్తీ! భక్తీ!

భక్తి:- (గబగబా వచ్చింది) రా! రావయ్యా

పాణి:- ఆ! (అని భక్తి బుగ్గపై కొట్టాడు)

భక్తి:- అబ్బ, వాసన! దూరంగావుందూ!

పాణి:- ఏం, సరదాగా లేదూ?

భక్తి:- నీ చేతిలోనే నాకు ముసలితనం వచ్చేసిందా నీ కింకా సరసాలు తగ్గలేదూ?

పాణి:- నా చేతిలో నీకువచ్చింది—ఎప్పుడైనాతప్పని ముసలి తనమే. కాని నీచేతిలో నాకొచ్చింది...చూసావా?

భక్తి:— సరే! యీగదిలోవుండు! (పాణిని గదిలోకిపంపి, రెండు మేడ మెట్లెక్కి—) గిరీ! ఎంత సేపే ?

గిరి:- (గబగబా మెట్లుదిగింది;

భోగా:— (తనూదిగాడు)

భక్తి.:— (దిగుతున్నవానికూడా వెళ్ళి) రేపు వస్తావుకదూ, బాబూ!

భోగా:— రాకపోతే, నిద్రపట్టొద్దూ ...

భక్తి:— అదీ ... (చేయిచాపింది)

భోగా:— నీపని బాగుంది. (అంటూ, ఒకరూపాయి చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు.)

భక్తి: (మొలను దోపుకుంటూ,) ఏంటే ? కొత్తబిచ్చగాడికి పొద్దు తెలియనట్టూ! ఇంతసేపా ? నేను పడుచు దనంలో వుండేటప్పుడిలాగా ? ముందు జేబు కాళీ చేసే దాన్ని రెండుమాటల్లో, శరీరంలో వేడంతాదింపేసి, పొమ్మనేదాన్ని—అలావుండాలి ...

గిరి:— యీ వెధవవృత్తి చెయ్యలేనే ?

భక్తి:— ఏడిశావ్ ? బిక్షగాడిపంచ గురుకొస్తుందేంటే ?

గిరి:— (తలపట్టుకొని) ప్రతికాముకుడిచేతిలో నలిగేకంటే, ఆపంచలోనే సుఖముందనుకుంటున్నా.

భక్తి:— (చెళ్లున దవడపై కొట్టింది.)

గిరి:— అమ్మా! (తలపట్టుకొని, మేడమెట్ల ద్వారంవద్ద పడింది)

భక్తి:— ఇంకెప్పుడూ, యీఇంట, వాడిప్రాసె త్తకు! అదుగో, చూడు! ఒక మర్యాదస్తుడు నీకోసంకనిపెట్టుకుకూర్చున్నాడు— వెళ్ళు! (అంటూ, గదివద్దకువచ్చి నెమ్మదిగా) ఊ! వెళ్ళవయ్యా! వెళ్ళు! (రెండోగదిలోకి వెళ్ళింది)

పాణి:— (వచ్చి, గిరిముందు భూతంలానిలబడ్డాడు)

గిరి:— (పాణిముఖంచూచి, కెవ్వున అరచింది)

పాణి:— అ హ్హా హ్హా హ్హా! ... ఏం? అందంగాలేనూ? సరిగ్గ చూడు! యీ నాఅందం అంతా మీ అమ్మలాంటి వాళ్ళ అందం చవిచూడ్డంవల్ల సంక్రమించిందే.

గిరి:— హా! [కళ్ళుమూసుకొంది]

పాణి:— అహ్హాహ్హాహ్హా!...లే! [అని జెబ్బపట్టుకొని ఎత్తాడు]

గిరి:— (రూపాయకాగితాలు చింపేసింది) యీ వెధవ రూపాయలకుః చూస్తూ విషంతాగమంటావా?

పాణి:— అ హ్హా హ్హా హ్హా! రూపాయలంటే, బలే వెగటు పుట్టిందే—పసుపుగ త్తెకు ... (బలాత్కరించాడు)

గిరి:— దూరంగావుండు! (టప్ మనికొట్టింది)

పాణి:— అ హ్హా హ్హా హ్హా! నే నెవడినో తెలుసా? మీ అమ్మ నడుగు! బతేతాగుబోతును ... (కోటులో సీసా తీసితాగుతున్నాడు) ... తెలుసా? రా! (అని లాగాడు)

గిరి:— వొదులు! వొదులు! దుర్మార్గుడా?

పాణి:- అహ్హా హ్హా హ్హా! ఊబ్బుతో, యీగంటా నిన్ను కొను కున్నా. నీపై నాకధికారముంది. రా! ముద్దుపెట్టు!

గిరి:- ఛీ! (తోసింది)

పాణి:- (గట్టిగా మణికట్టు పట్టుకున్నాడు)

గిరి:- అమ్మా! (అరిచింది)

భక్తి:- (గబగబవచ్చింది)

గిరి:- తాగి, మీదపడి. చూడే ... ?

భక్తి:- బాగుందయ్యో! పువ్వులాంటిపిల్లని నలిపేస్తున్నావే వెళ్ళెళ్ళు! పదమ్మా! పైకి.

పాణి:- ఇదిగో! నే నసలే ఖూనీఖోరుని ... మళ్ళీ వెంటనే పంపకపోయావా? మీతల్లి, బిడ్డల్ని, ఖూనీచేసి పారే స్తాను— తెలుసా? హేం!

గిరి:- (మెల్లెక్కుతోంది)

భక్తి:-(మెట్లెక్కబోయి, వెనక్కివచ్చి నెమ్మదిగా) ఆగదింకో వుండవయ్యా, దానికి నయానా, భయానా నచ్చచెప్పి పంపుతానూ ... (మెట్లెక్కి వెళ్ళింది)

పాణి:- అహ్హాహ్హాహ్హా! ఇక గిరి మారితీరుతుంది ... (మూడవ అంతస్థుపై కేకలు. భక్తి! "వెళతావా?" అని కంఛాతో గిరిని కొడుతోంది. గిరి! "బలవంతంగా చస్తానుగాని ఆ కష్టుగోగివద్దకెళ్లను?" అని మొర పెట్టుకున్నా వినకుండా "వెళ్ళవూ?" అని భక్తి కొడు తోంది - క్షణం గడిచింది.)

గిరి:- (జుట్టు విరబోసివుంది. జాకెట్టు చిరిగింది. చిందర వంద
రైన చీరతో గబగబా వస్తూంది.) చచ్చిపోతా,
నేను చచ్చి పోతా...

పాణి:- (చాటుకు వెళ్లాడు.)

భక్తి:- నిన్ను చావనిస్తానే? (ఖంచాపట్టుకొని వెంటాడు
తోంది.)

గిరి:- (డాబా, పిట్టగోడవద్దకొచ్చి, చీర కచ్చావేసి, గోడ
నుండి క్రిందకు దూకబోయింది.)

పాణి:- (లైటుఆర్పి, గిరి జెబ్బ పట్టుకున్నాడు.) ఆగు! నేను
మొట్టమొదట చిలకకు చెప్పినట్టు చెప్తా: యీకార్చి
చ్చులో దూకొద్దని వినలేదు...

గిరి:- ఎవరు?

పాణి:- అలాగే నిలబడు! నన్నుచూస్తే, ఇప్పుడే గుండాగి
చచ్చిపోతావ్?

భక్తి:- (లైటు లేసి) పాణీ!

పాణి:- నోరుముయ్... (మడతకత్తి 'టన్'మని తెరిచాడు...

గిరి:- (వెనుకకుతిరగటానికి ప్రయత్నం చేసింది.)

పాణి:- తిరక్కు!

భక్తి:- అమ్మయ్యో... నా...

పాణి:- ఊ! (పొడవబోయాడు)

భక్తి:- (నోరుమూసేసింది.)

గిరి:— తమరెవరో, కాస్త ముఖంచూపండి!

పాణి:- చూపను. నీపసితనాన్ని బలవంతంగా చంపిన పాపానికి వొడిగట్టుకోలేను. కాని నీవుమాత్రం, మహా పాపానికి వొడిగట్టావ్! నీకు మనసిచ్చిన రాజుకు, మతిపోగొట్టి, ఇల్లు విడిచిపెట్టి పోయేలాచేసావ్! పాపం! అతని తల్లొ, బెంగపెట్టుకు చనిపోయేలా చేసావ్?

గిరి:- ఎంతపని జరిగిపోయింది.

పాణి:- పో! ఇప్పుడు దూకు! ఊఁ! క్రిందికిదూకు! ఇంత మహా పాపానికి వొడిగట్టి, పైగా, అందం, సుఖం అని బోరవిరుచుకొని విర్రవీగేవ్!

గిరి:- (ఏడ్చింది.)

పాణి:- ఊఁ! దూకు! నీలాంటి శరీరాన్నమ్ముకుని జీవించే స్త్రీకి యీ సమాజంలో స్థానంలేదు.

గిరి:— అవును. మీరన్నది అక్షరాలా నిజం! ఇక నా బ్రతుకు వృధా! (అని క్రిందికిదూకబోతుంది.)

(గిరి జెబ్బపట్టుకున్నాడు పాణి. అదేసమయంలో "అమ్మా!" అని అరిచిన భక్తిని "ఊఁ!" అని నోరు మూయించాడు.)

పాణి:- పిచ్చిదానా? చచ్చి, ఏం సాధిస్తావ్? నీకింకా పట్టుమని పదహారేండ్లు లేవు. జీవితంలో సుఖమనేదాని దరిదాపులైనా నీకు తెలియవ్!

గిరి:- ప్రతికి నేను సాధించేదేమిటి ?

పాణి:- తప్పక సాధించగలవ్. నీరాజును కలుసుకోగలవ్ !

గిరి:- నారాజును కలుసుకోగలనా ?

పాణి:- ఆ, తప్పకుండా !

గిరి:- (చక్ మని వెనక్కితిరిగి, పాణి పాదాలపై బడింది- "దేవతలు—మీరు !"—అంటూ కనులువిప్పిచూసింది- ఆపాదాలు. కుష్టురోగం. క్రిందినుండి పైవరకూ చూచి, "హా !" అంటూ, వెనక్కి జంకింది.)

పాణి:— అవును. నిన్ను నేను ఇంతకుముందే బలాత్కరించేనని కదూ—ఆశ్చర్యపోతున్నావ్ ? అవును. నీకోసమే. నిజంగా నా తుచ్ఛకామానికి కాదు...

భక్షి:- అమ్మా—నీదుంప తెగోయ్...

పాణి:- నోరుముయ్ !

భక్షి:- (మూసింది.)

పాణి:- అవునుగిరీ ! నేనూ, నీలాగే, ఇదంతా సుఖమని నమ్మా...ఇదీ నాకు భగవంతుడు విధించిన శిక్ష. నాకట్టెదుటే, ఇంకొకరిలా అవుతున్నారంటె...నాకు తెలియని బాధ, నా నరాల్ని కొరుక్కుతింది...అంతే వచ్చా, నయాన్ని నిన్ను మార్చాలనుకున్నా లాభం లేకపోయింది. భయాన్ని...

గిరి: — ఇకాపండి ! (కాళ్లపై బడింది) నన్ను నిజంగా ఋణా

అగ్నిగుండంనుండి రక్షించిన ప్రభువులు—మీరు...
కాని నా రాజు ఎక్కడ, ఎలా...(ఏడ్చింది.)

(క్రిందివీధిలో బిక్షకుడు పాడుతాడు)

కాపాడుమా ప్రభూ ?
కనికరించి కాపాడుమా ?
తెలిసీ తెలియని, లోకం !
చేసే పాపాలనుగని
చేయకుమా, కన్నెర్రన !
కరుణను కాపాడుమా ?
ప్రభూ ! కాపాడుమా ?

పాణి:— చూసావా ? ఆజీవుడు తను బాధపడినా, బాధపెట్టిన వారిని కాపాడమని భగవంతుడ్ని వేడుకుండున్నాడు...

గిరి:— (గబగబా, డాబాఅంచుకెళ్ళి, పిట్టగోడ పట్టుకొని తొంగి, చూచింది ) రాజూ...రాజూ ... (అని గబగబా క్రిందికెళ్ళింది )

భక్తి:— గిరీ...

పాణి:— (కత్తిముడిచి, జేబులోపెట్టి) రాక్షసీ ! ఎలాగో, తప్పు తెలుసుకొని, తాను ప్రేమించిన రాజు కాళ్ళపైపడ్డానికి పోతున్న గిరి త్రోవకు అడ్డొసుతున్నావా?అయితే, నీ త్రోవకు నే నడ్డొస్తున్నా. పాతకీ—యీ నరకంలో నీవో చీడపురుగు. కాస్తపచ్చగా వున్నాడన్నల్లా కొరుక్కుతినే పామండివి; నీవు.

భక్తి:- అమ్మా, నీ కడుపు మండ!

పాణి:- ఊఁ! (అనిపిక పట్టుకొని గింజాయించి వొదిలిపెట్టి) పో! నిన్ను చంపితే, మరీపాపం చుట్టుకుంటుంది... నాకు భగవంతుడు వచ్చేజన్మలోనైనా త్రోవచూపు తాడు. యీలోకంలో, పేరుకుపోయినకుళ్ళు, అవినీతి ఎక్కడన్నావుంటే, అది నీముఖంలోనే తాండవిస్తోంది. నీ బతుకే పాపాలపుట్ట. ఇంకా పాపానికి వొడగట్టాలని నిన్నుచంపితే—అదీ దొరకదు. గిరి త్రోడకడ్లాలా? విషసర్పానైనా, నిన్ను కాటేయడానికి, నీవెంటే వుంటుంటా జాగ్రత్త! వెళతా! గిరి-రాజులను కలిపి, కాస్త యీజన్మకు పుణ్యంచేసుకుంటా! (వెళ్ళాడు.)

భక్తి:- (విలవిలా కొట్టుకుంటూ నడుం విరిగినపాములా మెలిదిరిగింది.)



# దురాశ దుఃఖానికే

ఏకాంకిక

ఇందులో

1. ప్రకాశం: ధనికుడు, పలుకుబడిగలవాడు వయసు 50.
2. మాణిక్యం: ప్రకాశం రెండో భార్య. చాంధసి 30.
3. రవి: ప్రకాశం మొదటిభార్య కొడుకు 25.

4. డాక్టరు. 5. దాసీ. 6. సాధూ.

వస్తారు

## తొలి రంగం

(ప్రకాశం ఇల్లు, గది హుందాతనంగావుంది. గదినిండా చిత్రాలు, కుర్చీలు, టేబిలు, బుక్ సెల్ఫు, వగైరా వుంటాయి. తెర లేచేసరికి, శ్రీకృష్ణునికి పూలమాల వేస్తూ మాణిక్యం ప్రత్యక్షం.)

మాణి:- (సాష్టాంగపడి) కృష్ణపరమాత్మా! జన్మ జన్మలకీ నీకు రుణపడుంటా. నాకోర్కె తీర్చవూ ? నీ వెందరి గోపికలనో తృప్తిపర చేవ్—యీ మాణిక్యం ఒక్కర్తె— నీ అనుగ్రహానికి అనర్హురాలైందా ? పరమాత్మా! నీ వేగాని నాకడుపున ఒక్క కాయ కాయించకపోతే, యీ ఆస్థంతా ఆ తుంటరి రవికి పోతుంది...నాభర్త

నన్ను ఆలించడు...పాలించడు...నీవైనా నామొరా లించి, పాలించవా—కృష్ణా! (లేచింది. చీరచెంగు నులుముతూ) ఇదిగో నాకు సంతానప్రాప్తి కలిగించ కపోతే, యిప్పుడే, నీ కళ్ళముందే, యీ మాణిక్యం నీలో కలిసిపోతుంది...(వురిపెట్టుకో బోవును.)

పరి:— (చేతిబెత్తం, కోటూ, పంచ, జరీకండువా ధరించి, తొందరగా వచ్చి) మాణిక్యం! (పట్టుకొని) ఏంటీ పిచ్చిపిచ్చి పనులు! ఎవరైనా వింటే ఏమనుకుంటారు?

మా:— (ఏడుస్తూ) ఆడదాన్నైన తరువాత కడుపునో కాయ యినా కాయకపోతే ఏమనుకోరా?—వూరంతా యిప్పటికే ఆడిపోసుకుంటున్నారు— నేను సవితనంట! గొడ్డుముండనట! (మారాంచేస్తూ, మరీ బిగ్గరగా ఏడుస్తూ) రవిని కోసుకు తింటున్నానట!...హుహు! హుహుహు!...మీరూ అంతే...?

పరి:— నేనేం చేసేనే?

మా:— మరిప్పుడెక్కడికి వెడుతున్నారు?

పరి:— పెద్దలు కబురంపారు...

మా: ఎప్పుడూ పెద్దలు, పెద్దలని పెద్దతీకం వెలిగిస్తుంటే, నా కడుపు నెప్పుడు కాయలుకాస్తాయ్!

పరి:— అబ్బ! ఎప్పుడూ వెధవ రోదనే...వురేసుకుంటే కాస్తాయా?...ఏదో ఒకరోజు అలా బయటికి వెడితే, కాయడం మానాస్తాయా?

మా:- హు! హు! వెళ్ళకండి!

ప్రి:- ఛీ! వెధవరొద! (అని విదళించుకుపోయాడు.)

మా:- (కృష్ణుని ఫోటోకు చేరబడి పొర్లి పొర్లిన దుఃఖంతో ఏడుస్తూంది) గాడిదకంటా అన్యాయమైపోయింది నా బ్రతుకు! కృష్ణా! (నెత్తి, ఫోటోకు కొట్టుకుం టుంది.)

దా:- (పరుగెత్తుకుంటూ వచ్చి) అమ్మా!...అమ్మా...!

మా:- ఏమన్నేమ్మ—వెధవమ్మ! అందరికీ లోకువై పోయిన బ్రతుకై పోయింది...ఎడారికాసిన వెన్నెలైందే— నా బ్రతుకు.

దా:- అలా అనకండమ్మా! మీ కడుపుని మాణిక్యం మెరుస్తుందమ్మా!

మా:- (కన్నీరు తుడుచుకొని) ఎలాగే—ఏలా ఏలాగో?

దా:- అదుగో! చూడమ్మా!

మా:- ఎవరే?

దా:- గో...ప్ప! సంతాన సాధూగారు! యీాయన పేరు చెప్పితే, ముసలమ్మయినా కనవలసిందే?

మా:- అలాగటే!...కాళ్ళకు నీళ్ళు తీసుకురా! (దాసి వెళ్ళబోతుంది) ఆ పళ్ళెంలో రెండు పండ్లూకూడా పెట్టి తీసుకురా...ఆకు...చెక్క! అన్నీ తీసుకురా!

దా:- అలాగేనమ్మా! (వెళ్ళింది)

సా:- జై! కృష్ణపరమాత్మా! (వచ్చాడు.)

మా:- దయచేయండి! (దాసీ తెచ్చిన నీళ్లతో పాదాలు
కడిగి దణ్ణం పెట్టింది.)

సా:- సుపుత్రా ప్రాప్తిరస్తు!

మా:- నిజంగానా ?...దయచేయండి! (కంగారుగా దాసీతో)
చాపతీసుకురావే! (దాసి చాప తెచ్చింది.)

మా:- ఇలా కూర్చోండి—స్వామీ!

సా:- కృష్ణా! (కూర్చొన్నాడు)

దా:- చూడండి, స్వామీ! మా అమ్మగారికి సంతానం
లేదు! (మాణిక్యం, చేయి, సాధూకి అందించింది.

సా:- (ఏదో యోగంలో కనుక్కున్న వాడిలా) అవునవును!
చెయ్యి చెప్పాతుంది.

మా:- చిత్తం—స్వామీ!

సా:- ఆఁ! జై పరమాత్మా!...(యోగంలో) మీరు చాలా
విధాల సంతానంలేక బాధపడుతున్నారు...

మా:- అవును స్వామీ!

సా:- పూజలు, పునస్కారాలు చేస్తున్నారు...

మా:- అవును స్వామీ!

దా:- మొన్న పౌన్నూరు తీర్థంకూడా వెళ్ళారు స్వామీ!

సా:- అవును చెయ్యి చెప్పుతోంది...

మా:- (ఏదో అడగబోయి) స్వామీ?

సా:- జై కృష్ణపరమాత్మా! ఆగు! నీమనసులో వుద్దేశం
నాకు తెలిసింది...

దా:- అదే స్వామీ !

సా:- సంతానం ఎప్పుడు ? అని ప్రశ్నిస్తున్నావ్ ?

మా:- (మురిసిపోతూ) అవును స్వామీ !

సా:- (ఓ పాత్రం తీసి) ఊ ! గ్లాసునిండా పవిత్ర గంగాజలం తెండి !

మా:- (దాసీని) వెళ్ళవే.

దా:- (తెచ్చింది.)

సా:- (ఏదో బాధ పడినవాడిలా)- క్రిష్ణ ! క్రిష్ణ!...

మా:- ఏం అపచారంచేసాం బాబూ !

సా:- గోదావరి నీళ్ళు తెచ్చి, గంగాజలమని పరమాత్మను న్యూనతపరచారు.

మా:- లేదు స్వామీ ! క్షమించండి ! స్వామీ ! (అని పాదాలు పట్టుకుంది.)

సా:- ప్రాయశ్చిత్తంగా పుణ్యక్షేత్ర సందర్శనం చేయాలి !

దా:- సంతానం కలుగుతుందా స్వామీ !

సా:- (కోపంతో) అది తరువాత ?

మా:- (ఏదో మాట్లాడబోతాది)

సా:- హారేకృష్ణ ! ఆగు ! తరువాతెప్పుడు ? అని అడుగుతున్నావ్ ?

మా:- అంతేస్వామీ ?

సా:- ఆ సందర్శనాల తరువాత, కాశీక్షేత్రం వెళ్ళి, యీ పాత్రం అక్కడ గంగా జలంతో సేవించండి ...

హారేకృష్ణ ! (లేచిపోయాడు.)

మా:- చిత్తం స్వామీ !

సా:- నేను చెప్పినట్టు చేయకపోయారా ? గోహత్యా, బ్రహ్మ హత్యా పాతకాలు చుట్టుకుంటాయి...

మా:- తప్పక చేస్తాం స్వామీ ! (దాసితో) ఆ ఫలాలు సాధూగారికివ్వవే !

రవి:- (చటుక్కున లోపలనుంచొచ్చి, చేతులు తుడుచు కుంటూ) స్వాములవారు ఫలాలతో తృప్తి పడ తారా ? ఘణం, ఘణం...చదివించండి !

(అంతా కంగారు పడతారు.)

మా:- వచ్చావ్ !...అయింది...కాపురం కాలిపోయింది...(బొడ్డుముడిలో రెండు రూపాయలు సాధూగారి కిచ్చింది. సాధు హారే కృష్ణ ! అని వెళ్ళిపోబోతాడు.)

రవి:-ఇకదయ చేయండిస్వామీ!సంసారుల్ని మీలాసన్యాశుల్ని చేయడానికి బాగా అవతరించారు...సోమరుల్లాగ ! (దాసితో) ఏం నిలబ్డావేమే ! సాగనంపు సాధూని !

దా:- నేనేం చేసానండి ! అమ్మగారు...

రవి:- నోరుముయ్ ! సొమ్మంతా చిలాపెంకుల్లా ఖర్చుపెడు తున్నారు...రేపే సంసారం—సాగరంలో కలిసిపో యినా—మీ వల్లనే జరుగుతుంది...

మా:- అమ్మోయ్...అమ్మోయ్...దాసీదానిని చాటేసు కొని నన్నెన్నెన్నిమాటలనేస్తున్నాడో...

రవి:- మీరు కలుగజేసుకోకండి—అమ్మగారూ !

మా:- అమ్మోరునా (పెడార్థం చేసుకొని) అమ్మోయ్!...
అమ్మోయ్ ... నన్ను అమ్మోరు చేసావా ? ...
అమ్మోయ్...అమ్మోయ్... (అని ఏడుస్తూ నెత్తి
బాదుకుంటూ—ఇంట్లో కెళ్ళిపోతుంది.)

రవి:- (దాసితో) ఇదీ వీరంగం ! ఏడిస్తేనేగాని వ్యవసాయం
సాగదులే ! బాగా తయారయారు ... పొన్నారెళ్ళి
విగ్రహాన్ని కౌగలించుకుంటేనో—దేముళ్ళ పాదా
లపై తల బ్రద్దలుకొట్టుకుంటేనో—సాధూలకు సలాం
చేస్తేనో కలుగుతుందీ—సంతానం...కానివ్వండి...
మీ యిష్టం వచ్చినట్టు కానీయండి.

(లోపల ఏడుపు వినబడుతుంటుంది. రవి స్కూలుకు వెళ్ళడా
నికి పుస్తకాలు వెతుకుతుంటాడు. దాసీ, అమ్మగారి
వైపూ...రవివైపూ బిత్తరపోయి చూస్తుంటుంది.)

రవి:- (పుస్తకాలు కనబడవు) ఏమే పుస్తకాలు ఏమ
య్యాయ్ ? (ఖంగారెక్కువైంది. దాసి మీదికెళ్ళి
జెబ్బ పట్టుకొని) ఏం ? మాట్లాడవేం ?

దా:- (బిక్కచచ్చి, మాణిక్యంవైపు చూచింది.)

రవి:- (మాణిక్యాన్నుద్దేశించి) పుస్తకాలేంచేసాయమ్మా !

మా:- (మొర్రోమంటూ) అదిగో ! నేను పుస్తకాలు తినే
సేనా ?...అందరిని అందరినీ తిన్స్తానా? అమ్మోయ్.
యీ నిందలు మోయలేను తల్లోయ్ ! (ఏడుస్తోంది.)

రవి:- (తల బాదుకొని) ఇదంతా ఖర్మ! (దాసీతో) ఏమే చెప్పవే? ఊ! చెబుతావా? చెప్పవా?

మా:- చంపెయ్! చంపెయ్! నేను చచ్చిపోతాను నాయనో... (ఏడుస్తుంది.)

రవి:- ఏం? (దాసితోనే) మాట్లాడవేం?

దా:- (చూపుతో పొయ్యి చూపింది.)

రవి:- ఎంతపని చేసారు? (లోనికెళ్ళి, కాలిన పుస్తకంతో వచ్చాడు. తల్లితో విచారంగా) ఎందుకమ్మా! యీ పుస్తకాలపై కసి!...నీవాంఛలకు నేనడ్డుగావుంటే, నేనిక యీ గుమ్మం త్రొక్కనులే!...సెలవ్!... (వెళ్ళాడు విచారంగా)

మా:- (ఏడుపు మానేసి, మెటికలు విరుచుకుంటూ వచ్చి) శని విరగడైపోయింది...వసేవ్! ఇక మనిష్టం...మన మిక పుణ్యక్షేత్రాలకు పయనమవ్వాలే!... (అటు చూచి) అరుగో వారు వస్తున్నారు.

(ప్రకాశం, పైకండువాతో ముఖం తుడుచుకుంటూ ప్రవేశం)

ప్రకా:- పాపం పెరిగిపోతోంది...ప్రాయశ్చిత్తం చేసుకుంటే నేగాని లాభంలేదు...వెధవ నా నోటితో వెధవ: తీర్పులు చెప్పాల్సొస్తోంది...హేభగవాన్! (అగ్ని క్షిష్ణ బొమ్మకు నమస్కారం చేస్తాడు.)

మా:- ఏమిటండా పాపం?

ప్రి:- ఏముంది—ఆ వెంకి—పీరిగాడికి తిరిగి, బిడ్డనుకంది...

మా:— ఆ కాయ నా కడుపున కాసినా...

ప:— ఛీ, ఎప్పుడూ వెధవ కోరికలూ...

మా:— పోనెండి! ఏమయిందిప్పుడు ?

ప:— పేటవాళ్ళంతా దాన్ని వెలెయ్యాలని తరిమివెయ్యాలని ఒకటేపట్టు...పెద్దటికానికి నన్ను తీసుకెళ్ళారు... ఏం చెయ్యను?...యీ పాపం నోటితో వూకొట్ట వలసి వచ్చింది...అబ్బ! ప్రాయశ్చిత్తం చేసుకో పోతే...

మా:— అయితే ఏ కాశీ, రామేశ్వరాలో పోదాం—పదండి!

దా:— అవునండయ్యగారూ! అమ్మగారికోరిక కలిసొస్తుంది...

ప:— ఏంటూ కోరిక ?

మా:— ఏమీలేదండి...పుణ్యక్షేత్రాలు సందర్శించి...

ప:— సందర్శించి...?

మా:— (పొట్లంతీసి) ఇది కాశీ గంగాజలంతో సేవిస్తే...

ప:— సేవిస్తే ?

మా:— (సిగ్గుతో తల వంచుకుంటుంది.)

దా:— కాయ కాస్తుందని...

ప:— అని ఎవడన్నాడు ?

మా:— సంతాన సాధూగారు చెప్పారు...

ప:— చాలించండి! వెధవ వేషాలూ మీరూనూ...

మా:—అన్నారూ! మీ కొడుకూ, తండ్రులకు నేనింత లోకువై

పోయూనా? భగవంతుడోయ్...భగవంతుడా ? (పెడ బొబ్బలెడుతూ లోనికి పోతుంది.)

ప:- ఏడు ! వెధనేడుపులూ, నువ్వూనూ. (చిరాకుగా కండువా తీసి, కుర్చీలో విసిరేస్తాడు.)

దా:- (గుండె బాదుకుంటూ) అయ్యగారూ ! అమ్మగారు నూతిగట్టెక్కి కూర్చున్నారు !

ప:- ఆ! ఆ! ఎంత తెగువ ?

మా:- (లోపలనుండి) ఇక నేను చచ్చిపోతాను భగవంతుడోయ్ !...

ప:- ఆగవే, బాబూ !

మా:- (ఏడుస్తూనే) లేదు ... చచ్చిపోతాను దేముడా. (దూకబోతుంది.)

ప:- దూకకే బాబూ ?

మా:- దూకేస్తాను దేముడా ? (పడడానికి గిలక పట్టుకుంటుంది.)

ప:- ఆ! ఆ! ఇదో పాపమూ!...అలాగే! అలాగే వెడదాం...రావే బాబూ !

దా:- (పరుగెత్తికెళ్ళి) అయ్యగారొప్పుకున్నారమ్మా! దిగిరండి—మాణిక్యమ్మగారూ !

మా:- ఒప్పుకున్నారా ? (అని హారతిపళ్ళెంతో వచ్చి ప్రకాశించిరాకు పడుతున్నా భర్తకు, కృష్ణునికి హారతిచ్చి దేవుని ఫొటోకు దణ్ణం పెడుతుంది.)

— తెర —

# తుది రంగం

(తొలి రంగం లాగానే అలంకరణ. ప్రకాశం, సుస్తీతో మంచం పట్టాడు...దగ్గుతూ లేస్తాడు. దాసీ పీకదానా అందిస్తుంది— తెర లేచింది.)

డాక్ట:- (వచ్చి) ఏడాదిలో ఎంత మనిషి ఎంత కర్యాార్యారు ?

ప్రి:— డాక్టర్ ! ఇంకా ఎంతవుతుందో...(దగ్గుతూ) డాక్టర్! చెట్టంత కొడుకు—బి.ఏ. చదువుతున్న కొడుకు కోప గించి దేశాంతరం పోయాడు...పుణ్యక్షేత్ర సందర్శ నాలతో నెకొండంత ఆస్తి తరిగిపోయింది...(దగ్గుతూ) క్రొవ్వత్తిలాగా ఆరోగ్యంకూడా కరిగిపోతోంది డాక్టర్. (దగ్గుతో లేస్తాడు)

డా:— పర్వాలేదండి...లేవకండి !

ప్రి:— ఏంటో డాక్టర్...నెలలునిండి నెలదాటినా, ఆమె ప్రసవించడంలేదు...

డా:— ఎవరు ?

దా:— అమ్మగారికండి ! పదో. మాసం...

డా:— పర్వాలేదు...ఒక్కొక్కరు గట్టిపిండం అయితే పదో మాసంలో కూడా కంటారు...

ప్రి:— చూడండి ! డాక్టర్...ఆ కాయయినా కాస్తే మనస్తా పమైనా తీరుతుంది.

డా:— మరి ముందెవరికీ చూపలేదా ?

దా:— ఓ నర్సమ్మొచ్చిందయ్యగారూ ?

డా:- వచ్చి ఏమంది ?

ప్రి:- మీలాగే అంది...

డా:- ఆహా! అయితే చూస్తా ?

మా:- (లోపలనుండి) అమ్మో...అమ్మో...అమ్మో...

దా:- నొప్పులొస్తున్నాయి బాబూ!

డా:- చూస్తా! (లోనికెళ్లాడు-మళ్లీవచ్చాడు-కాస్సేపట్కి-)

ప్రి:- (ఆత్రుతగా) ఏం డాక్టర్ ?

డా:- ఏమీలేదు...ఆ...(దాసీతో) హాస్పటల్ కెళ్ళి కాంపౌం డరును బేగ్ తీసుకొని రమ్మను,..ఆ!...కాంపౌండ రుకు రద్దీగా వుంటె, నీవే తీసుకురా బేగ్!

దా:- అలాగేనండయ్యా! (వెళ్ళింది)

డా:- (లోపలి కెళ్ళాడు...కాసేపట్కి వచ్చాడు)

ప్రి:- ఏం డాక్టర్ ?

డా:- ఏం లేదు...

ప్రి:- ఏంటా అనుమానం ?

డా:- అనుమానం కాదు...

ప్రి:- మరి ?

డా:- వుండండి! (లోనికెళ్ళాడు)

ప్రి:- (దగ్గుతూ లేచి మంచంపై కూర్చున్నాడు)

డా:- (వచ్చాడు)

ప్రి:- డాక్టర్! సుఖంగా ప్రసవిస్తుందా ?

డా:- ఆ! పర్లాలేదు...నొప్పులు రావడంలేదు కూడా...

ప:— నొప్పులు లేకుండా ప్రసవిస్తారా—ఎవరన్నా ?
మా:- (లోపల) అమ్మ !...అమ్మ...
ప:— చూడండి డాక్టర్ ! మళ్ళీ నొప్పులొస్తున్నాయి.
డా:— (మాట్లాడడు)
ప:— మాట్లాడ రేంటి డాక్టర్ ?
డా:— అవి నొప్పులు కావు.
ప:— మరి ? (ఆశ్చర్యంగా)
డా:— భ్రమ !
ప్ర:— అయితే నొప్పుల్లేకుండా ప్రసవిస్తుందా ?
డా:— ఆ !
మా:- (లోపల) అమ్మా...అమ్మా...!
ప:— వెళ్ళండి ! డాక్టర్ !
డా:— (వెళ్ళాడు)
ప:— (దగ్గుతూ, మంచం దిగి, ఆత్రుతతో ఎదురు చూస్తున్నాడు.)
డా:- (వచ్చాడు)
ప:— ఏమైంది డాక్టర్ ? ప్రసవించిందా ? పిల్లవాడు పుట్టాడా ?
డా:— మీకు మతిపోయిందా ? పిల్లవాడుకావాలా ? ఏడవడండీ ?
ప:— మరైతే ఏమైనట్లు ?
డా:— చిల్లరతిళ్ళు ఎక్కువగా తిన్నారు...

ప్రి:– అయితే ప్రసవించడం కష్టమా? డాక్టర్!
డా:– అసలు ప్రసవిస్తుందో ప్రసవించదో?
ప్రి:– (ఆత్రుతగా) అంటె?
డా:– ప్రసవించకపోవచ్చు.
ప్రి:– అయితే బిడ్డ దక్కదా–డాక్టర్?
మా:– (లోపల) అమ్మో...అమ్మో...
ప్రి:– డాక్టర్–మీకు పుణ్యముంటుంది–చూడండి డాక్టర్!
డా:– చెప్పానుగా భ్రమ!—అని!
ప్రి:– అదేంటి డాక్టర్! చెప్పు, డాక్టర్...ఏమైనా ప్రమాదం
జరిగితే—నా సర్వస్వం దీనితో నాశనమైపోతుంది...
ఎంతడబ్బైనా యిచ్చుకుంటా డాక్టర్...
డా:– తుది నిర్ణయం చెబుతా! (వెళ్ళాడు)
ప్రి:– (ఎంతో ఆత్రుతతో చూస్తున్నాడు)
డా:– (తిరిగి వచ్చాడు) చెప్పమన్నారా?
ప్రి:– చెప్పు డాక్టర్!...తల్లికి ప్రమాదం లేదుకదా?
డా:– ఎవ్వరికి ప్రమాదం లేదు...
ప్రి:– (దగ్గుతూ) డాక్టర్!...(కోపంతో)
డా:– (తూలి ప్రకాశంను పట్టుకొని) ఖంగారు పడకండి!
మా:–(లోపలనుండి) మధ్య నా ప్రాణం తీస్తున్నారు డాక్టర్
(మూలిగింది)
డా:– చెప్పమన్నారా?
ప్రి:– చెప్పండి!

డా:- ఆమె ప్రసవించదు...

ప్రి:- (ఆశ్చర్యంగా) ఏం డాక్టర్ ?

మా:- (లోపలనుండి) ఆ !

ప్రి:- ఆమెకు ప్రమాదం జరగొచ్చు!...త్వరగా చెప్పు డాక్టర్ ?

డా: అసలది...

ప్రి:- చెప్పండి!

మా:- (తూగుతూ గుమ్మం వద్దకు వచ్చింది అసలది...

డా:- గర్భిణీకాదు...

మా:- కాదూ ?...(అని గుమ్మంకి చేరబడి పడిపోయింది.)

ప్రి:- (దగ్గుతూ వెళ్ళి పట్టుకొని) మరేంటి డాక్టర్ ?

డా:- ఖంగారు పడకండి! అపాయంలేదు...నయమైపోతుంది.. అది...బల్ల!

ప్రి:- హా రే కృష్ణ! (కూలబడ్డాడు)

మా:- ఏంటి ? (భర్తపై పడింది)

డా:- అవును బల్ల! కడుపులో బల్ల!!

దాసి:- (పరుగున బేగ్‌తో వస్తున్న దాసి యీ మాట విని "టక్"మని ఆగిపోయి బేగ్ వొదిలేసింది.)

డా:- (సన్నగా నవ్వుతూ బేగ్ తీసుకొని వెళ్ళిపోయాడు)

— తెర —

త్వ ర లో

పడాల రామారావుగారి

"సీతారామరాజు పితూరి"

(నవల)

"పలనాటియుద్ధం"

(నాటకం)